కన్నఁ గావలసినదేమి? భేదభావము లేకదా భగవత్కారుణా లాభ ప్రతిబంధకములు. ఎన్ని వేషములు వేసినను, ఎన్ని ఛాయా పటములు తీయించుకొన్నను, యోగులమని దాసులమని జ్ఞానులమని యెన్ని యుపన్యాసము లిచ్చుచున్నను సమదర్శిత్వము లేదేని నిరర్థకములే యివియన్నియు ననుట స్పష్టము.

"జటిలో ముండీ లుంఛితకేశః కాషాయాంబరబహుకృతవేషః,
పశ్యన్నపి చ న పశ్యతి మూఢో హ్యుదరనిమిత్తో బహుకృతవేషః. 2
అంగం గళితం పలితం ముండం దశనవిహీనం జాతం తుండం,
వృద్ధో యాతి గృహీత్వా దండం తదపి న ముంచత్యాశాపిండం. 3
కురుతే గంగాసాగరగమనం వ్రతపరిపాలనమథవా దానం,
జ్ఞానవిహీనస్సర్వమతేన ముక్తిం న భజతి జన్మశతేన." 4

అను నీసూక్తులంబఠించి వేషధారులు కపటయోగులు కల్పిత భక్తులు ధనాశాపరవశులు తమదుష్పథమును విడనాడి పెద్దలం గాంచి సదభ్యాసముల నలవఱచికొని భగవత్కారుణకుం బాత్రు లగుదురుగాక. కపటనాటకసూత్రధారులు గాక యుందురుగాక.

భగవంతు నారాధించుమార్గము లనేకములు. అందు భగవచ్చరిత్రమును బఠించుటయు నొకమార్గమే. కాని కేవల పారాయణము మంచిదిగాదు. దానియం దిమిడియుండు విశేషార్థమూలమునఁ దత్త్వమును గ్రహించుటయే ప్రధానము. ఎన్నిసారులు పారాయణము చేసిన నందలిసారము తెలియదేని బిచ్చగాండ్రపాటవలె నుండును. ఫలము తావన్మాత్రమే. "యోఽర్థవిత్సకలం భద్రమశ్నుతే" అని శ్రుతి చాటుచున్నది. అధీతిబోధాచరణప్రచారణము లుండినఁగాని ఫలము కలుగదు. భగవచ్చరిత్రమును బఠించి దానియర్థము నెఱింగి

తదనుసారముగఁ దాఁ బ్రవర్తించి యితరుల కావిధమును దెలిపి వారు ప్రవర్తించునట్లు చేయవలయును. తానాచరింపక వేషధారియై యితరులకుఁ దెలుపుచుఁ దానాచరించినట్లు నటించుచు నుండువాఁడు వంచకుఁ డనంబడు. అట్టివారికి భగవత్కృప గగనకుసుమమే యనవలయు. అట్టివారి కపటోక్తుల నాలకించి చెడక సాధువుల నాశ్రయించి భగవంతు నారాధించు నుత్తమమార్గము నెఱింగి తరింపవలయును. మత భేదములను బరమేశ్వరుఁడు పాటింపఁడు. మతదూషకుల నాదరింపఁడు. దేవతాదూషకులకుం బొడసూపఁడు. వేషములకు లొంగఁడు. కపటనాటకసూత్రధారులఁ బ్రేమింపఁడు. సమదృష్టిగలవారినే యాదరించును. నిష్కపటులఁ బ్రేమించును. సద్భక్తిగలవారలచెంతనే యుండును. అట్టిభగవంతు నాశ్రయించి కృతార్థులము గావలయును. దేవు నాశ్రయించుటకు సాధనము లక్కఱలేదు. భక్తిసాధన మొక్కఁడు చాలును. అదియు నిష్కపటముగ నుండవలయును. శ్రద్ధయు దానికిఁ దోడుపడవలయును. అవి రెండును గుదిరినచో ఫలాభిసంధిరహిత సత్కర్మానుష్ఠాన తత్పరుండగును. దానఁ జక్కని జ్ఞానము తనంతన యలవడును. అయ్యది ముక్తిని గలిగించును. కావున మనమందఱము సీతారామచంద్రులను బ్రకృతిపురుషులని నమ్మి వారిచరిత్రములఁ దెలిసికొనుచు భవ్యతమమార్గమున వారల నారాధించుచునుండుటయే యత్యుత్తమమార్గము. అనపాయమగు నీమార్గమున వర్తించి శ్రీసీతారాములకరుణ కెల్లరు పాత్రులుగావలయును.

జగతి విశదమంత్రం జానకీప్రాణమంత్రం
విబుధవినుతమంత్రం విశ్వవిఖ్యాతమంత్రం,

దశరథసుతమంత్రం దైత్యసంహారమంత్రం
రఘుపతినిజమంత్రం రామరామేతి మంత్రం.
బ్రహ్మామృతానందఫలప్రదాయినం
వేదాంతవిజ్ఞానసుగంధపుష్పితం,
సీతాశుభాంగాంచితబాహుశాఖినం
శ్రీరామకల్పద్రుమమాశ్రయామః.
కనకనికషభాసా సీతయాలింగితాంగో
నవకువలయదామశ్యామవర్ణాభిరామః,
అభినవయుత్తవిద్యున్మండితో మేఘఖండ
శ్శమయతు మమ తాపం సర్వదా రామచంద్రః.
అలం శాస్త్రాభ్యాసైరలమసకృదామ్నాయపఠనై
రలం తీర్థస్నానై రలమఖిలయాగవ్రతజపైః,
అలం యోగాభ్యాసైరలమపి మహాపాతకభియా
యదస్మాకం రామస్మరణమహిమా సో విజయతే.
సీతామనోమానసరాజహంస సంసారసంతాపహరక్షమావన్,
శ్రీరామదైత్యాంతకశాంతరూప శ్రీతారకబ్రహ్మ నమోనమస్తే.

శరణాగతరక్షణరూపధర్మనిర్వహణమను
నాలవ ప్రకరణము
సంపూర్ణము.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1934.